జనవరి
1998



[illegible] శరీరార్పణ దివ్యగాథాః
లోకప్రసిద్ధాః బహుళాహి నార్యః
త్వయా సమానా భువినాస్తి నాస్తి!

# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక

| | | Frequency | |
|---|---|---|---|
| 1 | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | |
| 2 | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | |
| 3 | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | |
| 4 | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 1,900 |

Fare includes complimentary Dormitary accommodation and transport/ Guide charges. Tariff for Tour No.4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హోటల్ సదరన్"లో బసచేయండి. ఢిల్లీలో మా హోటల్ లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగు భోజనం, అరిశెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**

## Southern Travels/Hotel Southern

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi.)**

**ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh, New Delhi - 110 005.**

**(Phones : 5722210 (6 Lines); 5739508, 5782932)**

**Our branches**

Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones . 223658; 227233)

Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001 (Phones · 2267040; 2262633)

Hotel Howrah Complex, Opp. Madras Central Railway Station, Madras - 600 003 (Phones · 564864; 585253)

No. 10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet, Vijayawada - 520 002 (Phones 62227, 66624)

Pavan Palace, Ground Floor, Opp. T.S.R Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phone . 545565, 541099)

## శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2–2–21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6–3–609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**
**హైదరాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

# నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19–5–1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/–లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చే వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/–లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.–A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)**

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)**

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాత పేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

| పోలిశెట్టి సత్యనారాయణ | | యక్కలి బాలరత్నం |
|---|---|---|
| అధ్యక్షులు | మరియు కార్యవర్గ సభ్యులు | ప్రధాన కార్యదర్శి |

వైశ్య ప్రబోధిని
(మాసపత్రిక)



స్థాపితము
1969



సంపుటి
29



సంచిక
5



జనవరి - 1998



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.

సంపాదకీయం

# కృతజ్ఞత - కృతఘ్నత
## (ఆత్మార్పణదినం)

'కృతజ్ఞత' అంటే చేసిన మేలును మరచి పోకుండుట.

'కృతఘ్నత' అంటే చేసిన మేలును మరచి పోవుట.

'కృతఘ్నత'కు సంబంధించినకథ ఒకటి ఆంధ్రమహాభారతము శాంతిపర్వములో ఉంది. నాడీజంఘుని ఉపాఖ్యానము" అని ఆ కథకు పేరు.

"విను, కృతఘ్నుని మాంసము కుక్కలు తినగారోయున్" అంటాడు తిక్కనామాత్యులు ఆ కథలో.

హింసకు తావులేని సరిక్రొత్త మార్గాన్ని దుష్టశిక్షణ కొఱకు చూపింది - శ్రీ వాసవీదేవి తన నిండుప్రాణాన్నీ, తనతో కూడ రెండు వందల నలుగురి అసువులనూ అగ్నికి ఆహుతి చేయుటద్వారా.

ఇలాతలములో ధర్మప్రతిష్ఠాపన చేయుటకూ - దుష్టశిక్షణ జరిపి శిష్టులను రక్షించుటకూ భూభారాన్ని తగ్గించుటకూ పరాశక్తి అవతారాలెత్తిన సందర్భాలు పురాణాల్లో మనకు అనేకం కన్పిస్తాయి. ఆ అవతారాలన్నింటిలో ఆతల్లి హింసామార్గాన్నే అవలంబించింది.

శ్రీవాసవీదేవి అవతారము అందుకు పూర్తి విరుద్ధము. హింసకు తావులేనిది ఈ అవతారము. 'అహింసయే పరమధర్మము' అను వేదవాక్యానికి చక్కటి నిర్వచనమే శ్రీ వాసవీదేవి అవతారము.

అంతకుమునుపు గల ఆదిశక్తి అవతారాలన్నింటిలోనూ - ఈ వాసవీఅవతారములోనూ గల లక్ష్యము ఒక్కటే. మార్గము మాత్రమే వేరు.

"మనిషిని చంపుటకన్నా, మనిషి మనసులోని దుష్ట భావనలనూ, క్రౌర్యాన్నీ పోగొట్టుటవల్ల శాశ్వతంగా హింస భువినుండీ తొలగి - భువి దివిగా మారుతుంది". అనునది ఆదిశక్తి చూపిన ఈ సరిక్రొత్త మార్గములోని అంతరార్థము.

ఆత్మార్పణద్వారా, అంధకారబంధురమైన జగత్తులో అహింసా జ్యోతిని వెలిగించుటకు - తను వైశ్యకన్యగా జన్మించుట ద్వారా - వైశ్యులకీర్తినీ, త్యాగాన్నీ సర్వప్రపంచము గుర్తించునట్లు చేయుట ద్వారా వాసవీదేవి వైశ్యవంశకీర్తినీ - ప్రశస్తినీ శిఖరాగ్రమునకు చేర్చింది.

ఇంతకన్నా ఆశించవలసిన మేలు ఏముంది? అందుకే ఆమె ఆత్మార్పణచేసిన మాఘశుద్ధవిదియను అత్యంత ఘనంగా జరపవలసిన బాధ్యతా, కర్తవ్యమూ, ధర్మమూ వైశ్యసోదరులపై ఎంతో ఘనంగా ఉంది. అందుకే ఈ సంపాదకీయం.

ఆత్మార్పణ దినోత్సవాన్ని జరుపుకోకపోవడం కృతఘ్నత అవుతుంది. కృతఘ్నత వల్ల వచ్చేపాపం ఎట్టిదో తిక్కనగారు చక్కగా చెప్పిన విషయాన్ని మీరు ఇంతకుముందే చదివారు.

శ్రీ వాసవీదేవి ఆత్మార్పణచేసిన మాఘశుద్ధవిదియ ఈ సంవత్సరము (1998) జనవరి 30వ తేదీ శుక్రవారము ఔతుంది.

అందుకే వైశ్యసోదరులెల్లరూ తప్పక ఆత్మార్పణ దినోత్సవాన్ని అత్యంత భక్తి, శ్రద్ధలతో ఘనంగా జరుపుకోవాలి. జరుపుకోకపోతే 'కృతఘ్నత' అవుతుంది. తస్మాత్ జాగ్రత్త.

## విజ్ఞప్తి

# శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్

రిజిష్టర్డు నెం. 67/1990, వైశ్యప్రబోధినీ కార్యాలయం
జయనగర్ కాలనీ, కడప - 516 002.

విషయము : శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీఆత్మార్పణదినోత్సవాన్ని జరిపించుట -
- శ్రీ వాసవీ ఏకాహాన్ని నిర్వహించుట.

అయ్యా!

పరాశక్తికి గల పదునాల్గు నామములలో "కన్యక" ఒకటి. ఆ కన్యక అను నామానికి "పరమేశ్వరి" అను పదాన్ని జోడించి శ్రీ కన్యకాపరమేశ్వరీదేవిగా మన పూర్వులు అనాదినుండీ ఆరాధిస్తున్నారు. ఆ కన్యకా పరమేశ్వరీదేవియే అంధకార బంధురమైన ఈ ప్రపంచములో అహింసాజ్యోతిని వెలిగించుటకై "వాసవి" అను నామముతో కుసుమాంబ కుసుమగుప్తలకు తెలుగింటి ఆడపడుచుగా పవిత్రగోదావరీ తీరములో జన్మించి, తన అపూర్వ ఆత్మార్పణద్వారా వర్ణాశ్రమాచార ధర్మసంరక్షణ చేసింది. 'అహింసా పరమోధర్మః' అనువేదోక్తిని కార్యరూపములో చూపించి, ప్రపంచములో ప్రథమ సత్యాగ్రహి అయింది. 'రక్తరహితశాంతి సత్యాగ్రహము' అను సరిక్రొత్త విధానాన్ని ఈ ప్రపంచానికందించి, తన అవతార ధ్యేయమును నిరూపించుకొంది. అట్టి మహత్తర సంఘటన జరిగిన ఆ పవిత్ర దినము మాఘశుద్ధవిదియ. ఆ పుణ్యతిథి ఈ సంవత్సరము 30-1-1998 శుక్రవారము అయింది. అందువలన ఆయమ చేసిన ఆ త్యాగనిరతిని సర్వ ప్రపంచమూ మరియొక మారు మననం చేసుకొనునట్లుగా ఆత్మార్పణా దినోత్సవాన్ని అత్యంత భక్తి, శ్రద్ధలతో జరిపించవలసిందిగా మిమ్ములను కోరుచున్నాము.

ఈ ఆత్మార్పణ దినోత్సవ సందర్భంగా మన సంస్కృతి కోసమూ, మన జాతి కోసమూ, మన జాతి అభివృద్ధి కోసమూ చిరస్మరణీయమైన కృషి చేసి కీర్తికాయులైన మామిడి వెంకటార్యులు, ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి, లాలాలజపతిరాయ్, తుంపూడిభగవంతంగుప్త, దర్శి చంచయ్యగుప్త, కొప్పరపు సుబ్బయ్య, చేబ్రోలు రోశయ్యగుప్త మొదలగు వైశ్య మహనీయులకు ఆత్మశాంతిని ప్రసాదించమని సామూహికంగా అమ్మను ప్రార్థించు కార్యక్రమాన్ని ఆనాటి ఉదయం 7 గంటలకు వైశ్యపతాక అవిష్కరణ అనంతరము ఏర్పాటు చేయండి.

అట్లే ఆ రోజున 'శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరీదేవి ప్రీత్యర్థం అమరజీవులగు వైశ్యమహనీయుల ఆత్మశాంతి సిద్ధ్యర్థం' అనే సంకల్పముతో మాతృశ్రీవాసవీదేవికి పూజలు చేయించండి. ఈ మహత్తర కార్యక్రమాన్ని ఈ క్రిందివిధముగా జరిపించాలి.

**ఉదయం 4 గం॥ నుండి 6 గం॥ వరకు**

శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ సుప్రభాత పఠనము. ఈ మీ పై సమాఖ్య రూపొం దించిన అధికారిక సుప్రభాత, సహస్రోత్తర నామములుగల కేసెట్‌ను మాత్రమే పాడించాలి.

**ఉదయం 6 గం॥ నుండి 7 గం॥ వరకు**

వైశ్యపతాక ఆవిష్కరణ - సామూహిక ప్రార్థన (అమరజీవుల ఆత్మశాంతికై)

**ఉదయం 8 గం॥ నుండి 12 గం॥ వరకు**

మాతృశ్రీ వాసవీదేవికి అభిషేకము, లక్ష్యార్చన, శ్రీ వాసవీ నామములతో పూజ.

**మధ్యాహ్నం 12 గంటలకు**

నైవేద్య సమర్పణ, ప్రసాద వినియోగము.

**సా॥ 4 గం॥ నుండి 8 గం॥ వరకు**

అమరజీవులైన వైశ్యమహనీయుల సంస్మరణ - శ్రీ వాసవీదేవి ఆత్మార్పణ విషయములపై ఉపన్యాసము.

**రాత్రి 8 గంటలకు**

పునఃపూజ, అనంతరము గ్రామోత్సవము.

**శ్రీ వాసవీ ఏకాహము :**

ఈ ఆత్మార్పణ కార్యక్రమంలో మొదటి దశగా అంతకు ముందురోజు అనగా 29-1-98 గురువారం ఉదయం శ్రీ వాసవీ దేవి ఉత్సవమూర్తిని నయన మనోహరంగా అలకంరించి ఉంచి, ఆ మూర్తిచుట్టూ కూర్చొని "ఓం నమో భగవత్యై వాసవాంబాయై" అని పలుకుచూ 29-1-98 గురువారం ఉదయం 8 గం॥ నుండి 30-1-98 తేదీ శుక్రవారం ఉదయం 4 గంటల వరకూ ఏకాహాన్ని నిర్వహించండి. ఈ కార్యక్రమములో మీ పట్టణము లేక గ్రామములోని వైశ్యులందరినీ పాల్గొనునట్లుగా చూడండి.

ఈ క్రింది విధంగా మీ పట్టణము లేక గ్రామములోని వైశ్యులందరికీ ఒక సర్క్యులర్‌ను పంపండి.

ఆత్మీయ ద్వ్యుత్తరశత గోత్రీయులారా!

"30-1-98 శుక్రవారం (మాఘ శుద్ధ విదియ) మన మాతృశ్రీ, మన కులదేవత శ్రీ వాసవీదేవీ ఆత్మార్పణ చేసిన పవిత్ర దినము. ఆ రోజు ఉదయాన్నే మీ ఇంటి ముంగటిని శుభ్రపరిచి, రంగవల్లులతో రమ్యంగా అలకరించండి. మీ గృహ ముఖద్వారానికి మామిడి తోరణాన్ని కట్టండి. అనంతరము శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరీదేవికి శ్రీ వాసవీసహస్రనామములతో పూజలు జరిపి, శక్తికొలదీ నైవేద్యాన్ని సమర్పించండి. అనాటి సాయంత్రం 6 గంటలకు శ్రీ వాసవీ అష్టోత్తరశతనామములతో పునఃపూజను జరిపించి, నైవేద్యసమర్పణ చేయండి. ఆనాటి సాయంత్రము పునఃపూజ చేయుటను మరచిపోవద్దు."

30-1-98 శుక్రవారం, తెల్లవారుఝామున 5 గంటలకు పై మీ సమాఖ్య రూపొందించిన అధికారిక శ్రీ వాసవీసుప్రభాత, సహస్రోత్తర నామములుగల కేసెట్‌ను తప్పక పాడించండి.

జనవరి 29, జనవరి 30వ తేదీలలో ఎక్కడికీ వెళ్ళకుండా పట్టణములోనే వుండి, ఈ ఏకాహ కార్యక్రమాన్నీ, ఆత్మార్పణ దినోత్సవాన్నీ ఘనంగా జరిపించవలసిందిగా శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవ్యాలయముల నిర్వాహకులనూ, ఆర్యవైశ్య ధర్మ సంస్థల పరిపాలకులనూ కోరుచున్నాము.

నమస్సులు, భవదీయుడు

పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి

ప్రధాన కార్యదర్శి

# ప్రజానాయకుడు "శ్రీ॥ శే॥ కొప్పరపుసుబ్బయ్య శ్రేష్ఠి"



రచన : మహాకవి, సరస్వతీపుత్ర పుట్టపర్తినారాయణాచార్యులు, కడప.

అజానుబాహువులు, విశాలమైన ఫాలము, ఆ ఫాలమును జూచినంతనే అతని అదృష్టము వ్యక్తమగుచుండెను. ఆ కన్నులలోనెంత రాజసమో అంతటి లాలిత్యము. అవి వెడదకన్నులు. ఒక చూపుతోనే యెదుటివారి హృదయము నాకళించుకొనెడిశక్తి వానికుండినది. కంఠ స్వరము మేఘగర్జనమే. వెడదయైన ఛాతీ. అతడు చిన్నవాడు బాగా కసరత్తుచేసినవాడు. జీవితమంతయు నారోగ్యముపై దృష్టియాతనికుండినది. కాఫీత్రాగి యెఱుగడు. పొగాకుతోడి సంబంధమేలేదు. జీవితమంతయు కట్టుకొన్నది ఖద్దరే. ఆ గుడ్డలు గూడ నతిసామాన్యమైనవి. దుస్తులనుబట్టి తన్నెవ్వరు గమనింప గూడదని యాతని యూహ. ఆ గుడ్డలు శుభ్రముగానుండెడివి. వానితెలుపు పదిబారలకు కొట్టుచుండెను. ఆ నిండు మనుష్యుడు - వీధులలో నడచిపోవుచున్నప్పుడు - నిండుగా పూచిన మల్లెపొద కదలిపోవు చున్నట్లుండెను. ఆయనజుట్టు . గతశతాబ్దమునకు సంకేతము. నవనాగరికులతో దిరిగినను వారి స్వభావములను దిగుమతి చేసుకొనెడివాడుకాడు. తన విశ్వాసము లాతడు గట్టిగా నేర్పరచికొనియుండినవాడు. అవి పేకమేడలుకావు. గట్టి పునాదులతో నిర్మించిన హర్మ్యములు.

జన్మతోనాతని కదృష్టము వెన్నంట లేదు. అతడదృష్టమును సృష్టించుకొనెను. మట్టిలోనుండి తయారయిన మనుషి యాతడు. స్వయంవ్యక్తియగుటచే - ధైర్యమాతనికి వెన్నతోవచ్చినది. ఎట్టి క్లిష్ట సమయములందును జంకినవాడు కాడు. ఎందరు తన్నెదిరించినను గుండె నీరు గారినది లేదు.

అవి జాతీయోద్యమము ప్రబలిన దినములు. సుబ్బయ్యగారు జైలుకు వెళ్ళినదిలేదు. వెళ్ళివచ్చిన వారి కుటుంబములకు - ప్రతిబానికిని - ఆయన సాయమంధనే అందినది. ప్రకాశం - బులుసు సాంబమూర్తి - కల్లూరిసుబ్బరావు - గొల్లపూడిసీతారామశాస్త్రి మొదలగు మహామహులెందరో - సుబ్బయ్యసెట్టి చేయి యెముకలేనిదని యెఱుగుదురు. ఊరిలోగూడ కష్టపడుకుటుంబములను జూచి యాత డోర్చినదిలేదు. గుట్టుగ సాయమొనర్చి గుప్తముగ వెళ్ళిపోయెడివాడు. అతని యీ నిగూఢ దానములను

ప్రొద్దుటూరిలో కథలుగ జెప్పుకొనగా నేను విన్నాను. అతని యిల్లొక అన్నసత్రము. ఎవరెవరో - ఎందుకు వచ్చినారో - ఎన్నాళ్ళుందురో - యీ ప్రశ్నలు లేనేలేవు. ఇంటియందు రాత్రింబవళ్ళు పంచాయితీల తీర్పునకు గాచుకొన్న మనుష్యులు. అనేక జగడముల నాతడు కోర్టులకు వెళ్ళనివ్వక పరిష్కరించి పంపెడివాడు. అతని తీర్మానము ఉభయపక్షములకును సమ్మతముగా నుండెడిది. అనేకులు పల్లెవారు సుబ్బయ్యశ్రేష్ఠిగారితో తమ రగడలు పరిష్కరించుకొనుటకు వచ్చెడివారు. ప్రొద్దుటూరి కే పండితులు వచ్చినను ప్రత్యక్షముగ - పరోక్షముగ నాతని సాయమందవలసినదే. గాయకులనుగూడ నాత డాదరించెను. ఏ రంగమందయినను ఒక ప్రముఖవ్యక్తి ప్రొద్దుటూరికి వచ్చి నిరాదృతుడై పోవుటయన్నచో సుబ్బయ్యసెట్టికి కంటగింపుగా నుండెడిది. అనేక బీద కుటుంబములాతని నాశ్రయించియుండెడివి. గీత యాతని పారాయణగ్రంథము. ఆ పారాయణము లేనిది గ్రంగ ముట్టెడివాడుకాడు. జపము, తపము పూర్తియైన తర్వాతనే బయటికి వచ్చుట. జనకమహారాజన్నచో సుబ్బయ్యకు ప్రీతి. అట్లు బ్రదుకవలెనని తానాదర్శమును నిర్మించుకొనెను. అట్లే బ్రదికెను. లక్షలకొలది ధనమాతని చేతిపై బారాడుచుండెడిది. కాని తాను దానికి ధర్మకర్త ననుభావమే. ధనముచేగలుగు నహంకారమున కాతడు వైరి. అనుభవించుట కన్నియున్నను అతడాశ్రమ జీవితమ్మునే. గడపెను. అతడు పరనారీసహోదరుడు. ఆ విషయమున సెట్టిది కఠోరమయిన దీక్ష. అతని భార్యయు భర్తకనురూపిణి. వారి దాంపత్యమ్ము పూవుగంధమువలె నుండెడిది.

ప్రొద్దుటూరిలో నతడెక్కిరాక ముందు వైశ్యులెవరిదారి వారిదిగ నుండెను. అతడు వార నందఱ నొకకొలికికి దెచ్చినాడు. ఆ కృషిఫలమే మైళ్ళకొలదిదూరమగుపించు శిఖరమున్న - వాసవీదేవ్యాలయ నిర్మాణము. ఆ దశరావేడుకలు జనులకు నయనోత్సవములు. ఆ అమ్మవారిశాల ప్రజల కొక యాత్రాస్థలమైనది. అతని తొలిరోజులలో - యెందరో అసూయాపరులాయన కపకారమొనర్చిరి. బాధలు గల్పించిరి. కాని సుబ్బయ్యసెట్టి వారి కుపకారమునే యొనర్చెను. తన భవిష్యత్తును నిర్మించుకొనుటకు యెన్నియవమానములనో జీర్ణించుకొనెను. గిట్టనివారు చేయు ఎన్నినిందలనో సహించెను. తానెన్నడును పరుల నవమానించినవాడుకాడు. ప్రభుత్వమే పనిగట్టుకొని హిందూ - ముస్లిమ్ పోరాటములను రెచ్చగొట్టుచున్న దినములవి. అట్టి గడ్డురోజులలో నాతడు - హిందూ, ముస్లిం సఖ్యత కెంతయో కృషిచేసెను. అతనిని మనసార ప్రేమించువారిలో ముస్లింలెందరో యుండిరి.

అతడొకసారి ఆర్యవైశ్యమహాసభ కధ్యక్షులుగా నుండెను. పురపాలక సంఘమున కుపాధ్యక్షుడుగా పదునైదు

సంవత్సరములు గడపెను. అదియు తన వినయముననే. పదిసంవత్సరము లధ్యక్షుడుగానుండెను. ఆతని జీవితములో నీ పదవికెన్నడును పోటీలేదు. ప్రజాభిమానమునంతగా చూరగొన్నవ్యక్తి కడప జిల్లాలో లేడని చెప్పవచ్చును. ఆతనిని అఱువదియేండ్లు నిండకముందే కాలము గబళించివేసినది. శ్రీ కొప్పరపుసుబ్బయ్యసెట్టి ఒక విశిష్టవ్యక్తి - పూర్ణమానవుడు. ఇతర రాష్ట్రములలోనైనచో నెన్నడో ఆతడు జాతీయనాయకుడై యుండెడివాడే. రాయలసీమ ఆతనిని కానివ్వలేదు. సుబ్బయ్యసెట్టి పెద్ద దురదృష్టము - ఈ సీమలో పుట్టుటయే.

## మీరు ప్రతిసారీ ప్రచురించే 2, 3 వ్యాసాలు చాలా విలువైనవి

చిరంజీవీ!

వైశ్యప్రబోధిని ప్రతినెలా సక్రమముగా అందుచున్నది. మీరు ప్రతిసారీ ప్రచురించే 2, 3 వ్యాసాలు చాలా విలువైనవి. మీరు మంచిభాషతో భావసౌందర్యముతో వ్యాసములు రచించగలవారు. 1969 నుండీ పత్రికను వైభవంగా నడుపుచున్నారు. గొప్ప నాయకులందరూ మీకు స్నేహితులు. విస్తృతంగా చందాదారులసంఖ్యను పెంచుటకు మార్గమును ఆలోచించండి. మాతృశ్రీ వాసవీమాతను మీ ఈప్సితార్థములను నెరవేర్చమని ప్రార్థిస్తున్నాను.

గ॥రెసత్యనారాయణగుప్త
ప్రార్థనాగానప్రచారసంఘము
విజయవాడ, 9-12-97

## వాసవిచరిత్ర పూర్తి విషయాలు తెలిపినందుకు సంతోషము

ఆర్యా!

మీరు రచించిన 'వాసవి' గ్రంథమును అనంతపురం పాతవూరు ఆర్యవైశ్య సంఘము తరపున ఉచితముగా పంచినాము. ఆ గ్రంథాన్ని చదివి చాలామంది ఎంతోమెచ్చుకొన్నారు. వాస్తవానికి ఇంత వరకూ వాసవీదేవిచరిత్ర సరిగా మాకు తెలియదు. 'వాసవి' అంటే ఒక కులదేవత అని మాత్రమే తెలుసు. ఆమె చరిత్ర, పూర్తి విషయాలు తెలిపినందుకు సంతోషము అని మాకు వ్రాస్తున్నారు.

పార్శంసత్యనారాయణశ్రేష్ఠి
కార్యదర్శి, 18-11-97

## గాయత్రీ స్వాములవారి ఆధ్వర్యములో అనంతపురములో సామూహిక ఉపనయనాలు

అనంతపురం పాతవూరు ఆర్యవైశ్య సంఘము, ఆర్యవైశ్యయువజనసంఘము, ఆర్యవైశ్యమహిళాసంఘముల వారలు కలిసి ఈమధ్య 9 మంది ఆర్యవైశ్యులైన వటువులకు సామూహిక ఉపనయనాలు జరిపించారు. అనంతపురము పాతవూరులోని శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవ్యాలయములో జరిగిన ఈ ఉపనయన కార్యక్రమానికి శ్రీ గాయత్రీస్వాములవారు అధ్వర్యము వహించుటయేగాక, స్వామివారు ఉపనయన ఆవశ్యకతను, మామిడి వెంకటార్యులవారి జీవిత విశేషాలను, ఈ సందర్భంగా వివరించారు. పై మూడు సంఘాలవారు సంయుక్తముగా గత రెండు సంవత్సరాలలో కూడ సామూహిక ఉపనయనాలు జరిపించారు.

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

(వైశ్యశ్రేష్టులు రాజు రాకను తెలిసికొని ఆయనకు ఎదురేగి పట్టణము లోనికి రండని చెప్పిరి. అందులకు సమ్మతించిన విష్ణువర్ధనుడు ఆ వైశ్య శ్రేష్ఠులను సత్కరించి, 'అట్లే రేపటిదినము నేను అచ్చటకు వచ్చెదను ' అని పలికెను. ఆ వైశ్యశ్రేష్ఠులు సంతోషపడి రాజు రాకకు ఎదురుచూచు చుండిరి.)

ఇది స్కాంధపురాణమందు - సనత్సు జాతీయ సంహిత గల ఉత్తర ఖండము - వైశ్యుల, విష్ణువర్ధనుల సమాగమమును చెప్పెడి పంద్రెండవ అధ్యాయము.

## పదమూడవ అధ్యాయము

సాలంకాయన ఋషి ఇట్లు చెప్పుటను ప్రారంభించెను. రాష్ట్రవివర్ధనుడైన విష్ణువర్ధన రాజు ఉదయాన్నే లేచి, స్నానము, సంధ్య మొదలగు నిత్య కర్మలను చేసి, దివ్యము లైన చందనము, పుష్పములు, తాంబూల ములతో బ్రాహ్మణోత్తములను సంతోష పరచి, సభామంటపానికివచ్చి, (పుర ప్రవేశా నికి ఉద్యుక్తుడై బయలు దేరెను.)

1 - 2 అ. 31 - పుట 321

పురజనులు ఆ విష్ణువర్ధనుని జూచిరి. బంగారుమయమైన గవాక్షముల రంధ్ర ముల నుండి పురస్త్రీలు తమ వికసించిన నేత్రములతో ఆ విష్ణువర్ధనుని జూచిరి.

4 1/2 - 9 1/2 అ.31 - పుట 321

(కుసుమశ్రేష్ఠి ఆ రాజశ్రేష్ఠుని తన గృహద్వారమందునిలిపి వైశ్యస్త్రీలచే మంగళ నీరాజనము లిప్పించెను. ఆ రాజ శ్రేష్ఠునికి కుసుమశ్రేష్ఠి ఇంటి యందు జరుగు నీరాజన కార్యక్రమమును తిల కించిన వారిలో 'వాసవి'యు ఉండెను.)

(రాజాంతఃపురము వద్ద నీరాజన మిప్పించిన తర్వాత, కుసుమార్యుడు, ఆ విష్ణువర్ధన రాజేంద్రుని తమ కులదేవత శ్రీ కన్యకాపరమేశ్వరీదేవి ఆలయమునకు తీసుకవెళ్ళి అచ్చట ఆయనకు గోత్ర నామముతో పూజలు జరిపించెను. విష్ణువర్ధనుడు ఆలయానికి వెళ్ళునప్పటికి 'వాసవి' తన మధురమైన కంఠముతో ఆ దేవి మహిమలను కీర్తిస్తూ ఉండినది. ఆ మధురస్వర శ్రవణముతో ముగ్ధుడైన విష్ణువర్ధనుడు తలనెత్తి వాసవిని చూచెను. అలౌకికమూ, అద్భుతమూ, అమరకాంతల ఆకార వైభవమును సైతమూ తిరస్కరించు ఆమె రూప, కళా వైభవములను చూచి, ఆ రాజు ముగ్ధ డయ్యెను. వెంటనే ఆయనలో కామ భావనలు పొటమరించెను.)

సౌందర్యముచే ప్రకాశించుచున్న 'వాసవి' వైశ్యవంశమను పాలసముద్ర మందు స్త్రీ రూపాన జన్మించిన అమృతము. కుసుమాంబాదేవి గర్భము అను ఆకాశ మున చక్కని చంద్రకళతో ప్రకాశించునది.

కుసు మశ్రేష్ఠి అను 'రోహిణి' పర్వతమున పుట్టిన మహామణి. విరూపాక్షుడు అను కల్పవృక్షమును అనుసరించి పుట్టిన శుభమైన లత. ముఖము అను ఆమె పద్మము చుట్టూ తిరుగుచున్న మదించిన తుమ్మెదల పిల్లలను తన హస్తముతో తోలుచుండినది. పై వర్ణనలతో ఒప్పుచున్న 'వాసవి'ని విష్ణువర్ధనుడు చూచెను.

16 1/2 - 19 1/2 అ.31 - పుట 323

వాసవిని తిలకించిన ఆ విష్ణువర్ధనుని హృదయము ఆశ్చర్యము కూడినదిగా అయినది. తలను ఆడిస్తూ ముక్కుకొనపై చూపుడు వ్రేలును ఉంచుకొని, దిగ్విజయ యాత్రచేస్తూ నేను సమస్త భూమిని చూచి తిని. ఇంత రూపవతి అగు కన్యకను నేను ఎక్కడా చూడలేదు. మెఱుపుతీగే ఈ భూలోకమున స్త్రీగా పుట్టినదో? యేమో? (ఈమె రూపసౌందర్యమును వర్ణించుటకు సహస్రఫణములు గల శేషునకు గూడ సాధ్యము కాదు.)

19 -20 అ.31 పుట 325

విష్ణువర్ధనరాజు పులకించిన దేహము కలిగినవాడై ఆ వాసవిని చూస్తూ, మన్మధ బాణములచే బాధింపబడెను. నూతన వస్త్రాలూ, మణిమయములైన ఆభర ణాలూ, పచ్చకర్పూరముతో కూడిన తాంబూలమును ఆ వైశ్యశ్రేష్ఠులకుఇచ్చి సన్మానించెను. ప్రత్యేకముగావారి కుశ లములను అడిగి కాంతి సంపదలతో రతీదేవిని జయించినట్టి ఈ కన్యక ఎవరు? రంభయే ప్రత్యక్షముగా అవతరించినదా? లేక ఊర్వశి కానీ, తిలోత్తమకానీ ఈ విధముగా పుట్టినదా? అని మధురాక్షరము లతో ఆ వైశ్యులను అడిగెను.

21-34 1/2 అ. 31 - పుట 327

ఆ వైశ్యులలో వృద్ధులైన కొందఱు రాజా! ఈమె ప్రభాతస గోత్రమునందు పుట్టిన కుసుమశ్రేష్ఠి పుత్రిక. పుత్రకామేష్టిని చేయగా (ఆదిశక్తి) అనుగ్రహంవల్ల జన్మించి నది. ఈమె తల్లి కుసుమాంబ. విశేషము లైన గుణములు కలది. కుసుమాంబ, కుసుమ శ్రేష్ఠుల కుమారుడైన విరూపాక్షునికి అక్క.

35- 37 అ.31 పుట 327

ఇట్లు తెలుసుకొని, విష్ణువర్ధనరాజు వారలను పంపించి, ఏకాంతస్థలమునకు వెళ్ళి, తన దేహము పుష్పశయ్య అందు బహుకష్టముగా పడవేసెను. అధికములైన వేడి నిట్టూర్పులతో చిగురులవంటి అయన పెదములు కంపించుచుండెను. (ఆ రాజు కామభూతము పట్టిన వానివలె నుండెను)

37 1/2 - 38 అ. 31 - పుట 327

అంత ఆ విష్ణువర్ధనుని మంత్రులలో శ్రేష్ఠుడు, బుద్ధిమంతుడు, ప్రభువు అప్ప గించిన కార్యమును నెరవేర్చుటలో నిపు ణుడు అగు విజయసింహుడు వచ్చి "ఓ ప్రభూ! ఏమిటి? ఈ నీ చింతకు కారణ మేమి? మూడు లోకాలలోనూ నీకు సాధ్యపడని వస్తువే లేదుకదా? నాలుగు దిక్కులూగల రాజులు నీ అజ్ఞకు లోబడి పన్నులు ఇచ్చుచున్నారు కదా? సకల మంగళములను పొందిన నీవు ఇంకా పొందవలసినది ఏమి ఉన్నది" - అని వినయముతో అడిగెను.

39 - 45 అ. 30 - పుట 329

"ఓయీ! మంత్రి శ్రేష్ఠా! సహించుటకు వీలు కాని ఈ నా దుఃఖమునకు కారణము వినుము. శత్రువులందరినీ జయించితిని. విజయమునూ, సంపదనూ చేకొంటిని. మూడులోకాలనూ జయించిన నా చిత్త

మును వాసవి జయించినది. ప్రీతిగా మాట్లాడికానీ, ఏనుగులూ, గుఱ్ఱములూ, గోవులూ, రత్నములూ మొదలగు వానిని ఇచ్చి కానీ చివఱకు నా రాజ్యమును ఇచ్చి అయినా సరే, ఆ వాసవిని నాకు ప్రియురాలుగా చేయుము. అందుకు నీవు సకల విధములా ప్రయత్నించుము. అట్లు కానిచో నాకు మీరు లేరు. మీకు నేనులేను. ప్రాణములను ఇక్కడినే విడిచిపెట్టెదను. కావున నీకు ఇష్టులైన మిగిలిన మంత్రులను కూడుకొని పోయి, కార్యమును నెరవేర్చుము" - అని పలికెను.

45 1/2 - 48 1/2 అ. 31 - పుట 329

ఆ మంత్రిశ్రేష్ఠుడు మిగిలిన మంత్రులతో కూడి, వెలుపలికి వచ్చి, ఉపాయమును ఊహించి, కుసుమశ్రేష్ఠి భవనమునకు వెళ్ళెను. సభయందుగల కుసుమశ్రేష్ఠి మొదలగు వైశ్యోత్తములనుచూచి, అయ్యా! కుసుమశ్రేష్ఠీ! కన్యకలలో రత్నమైన నీ కుమార్తెను చంద్రవంశమందు చంద్రునివలె ఉన్న మా విష్ణువర్ధనరాజుకు ఇవ్వుడు. ఈ భూలోకాన నీవు రాజువు అగుదువు. సందేహము లేదు. నీకు పొందుటకు సాధ్యముకాని పదార్థము ఏదీ ఈ భూలోకాన ఉండదు" - అని వినయపూర్వకముగా అడిగెను.

49 - 52 అ. 31 - పుట 331

కుసుమశ్రేష్ఠి విష్ణువర్ధనుని మంత్రి పలుకులు విని, అగ్నిని తన గర్భములో ఉంచుకొన్న జమ్మిచెట్టువలె అత్యుగ్రమైన అతికోపముతో ఉండెను.

52 1/2 - 53 అ. 31 - పుట 331

ఇది స్కాంధపురాణమందు - సనత్సుజాతీయ సంహితగల ఉత్తరఖండము - వాసవీకన్యకను అడుగుట - పదమూడవ అధ్యాయము.

## పదునాల్గవ అధ్యాయము

సాలంకాయన మహర్షి చెప్పుచున్నాడు. ఓ రాజమంత్రులారా! మీరు చెప్పినదంతా యుక్తమైనదే. మా వంశమున పుట్టిన కన్యకలను ఇతరులకు ఇవ్వవలయునా? ఇవ్వవలదా? అని నిర్ణయము చేయుటకు నా ఒక్కనికీ సాధ్యము కాదు. పద్దెనిమిది పట్టణాలలోని అశేషబాంధవులనూ పిలిచి, వారి అనుగ్రహమున విధిపూర్వకముగా వివాహము చేయదగినది. అట్లు చేసిన మా వంశము ప్రశస్తమౌతుంది.

1 - 3 1/2 - పుట 333

(కుసుమశ్రేష్ఠి ఆహ్వానాన్ని అందుకొని, పద్దెనిమిది పట్టణాలలో ఉండు వైశ్యులు బృహద్గిరిని చేరుకొనిరి.)

కుసుమశ్రేష్ఠి, రమ్యమైన శ్రీ కన్యకా పరమేశ్వరీదేవ్యాలయములో - తూర్పు వాకిటిలో గల మంటపమందు హితులతో కూడి కూర్చుండిన ఆ వైశ్యులకు నమస్కారము చేసి, ఓ నగరస్వాములారా! మీరందరూ నా విన్నపాన్ని ఆదరించి, వచ్చితిరి. ఇపుడు కృపతో, ప్రీతితో వినుడు. విష్ణువర్ధనరాజు నా కుమార్తె అగు వాసవిని తనకిచ్చి వివాహము చేయమని మంత్రులతో అడిగించినాడు. నేను మీ అధీనుడను. ఓ వైశ్యపుంగవులారా! కన్యకను ఇచ్చుట, ఇవ్వకుండుట అను విషయమున నిర్ణయం తీసుకొనుటకు నాకు సామర్థ్యములేదు. మీరంతా బాగుగా ఆలోచించి నాకు ఏమని హితవును చెప్పుదురో దానిని చేయుదును అని పలికెను.

6 - 10 1/2 అ. 32 - పుట 335

(ఆ కుసుమశ్రేష్ఠి మాటలు విన్న ఆ నగరస్వాములు, విష్ణువర్ధనుని కోరిక ధర్మవిరుద్ధము. అందువలన కన్యను ఇవ్వవద్దు అని ఏకగ్రీవముగా చెప్పిరి.)

ఆ సభలో ఉన్న విజయసింహుడు లేచి, సౌందర్యము, కాంతి, సంపద కలిగిన స్త్రీలు లోకమున లేరా?, అయినా మా రాజు మీ సంబంధమును కోరుచున్నాడు. ఇంద్రునితో సమానుడైన మా విష్ణువర్ధన రాజుకూ, కుబేరునితో సమానమగు సంపద గల మీకు సంబంధము వసంతునికీ, వనములకూ ఉన్న సంబంధము వలె సకల లోకములకు ఆనందప్రదముగా ఉండును అని పలికెను.

- 17 - 19 అ. 32 - పుట 335

ఆ మాటలు విన్న మౌద్గల్యస గోత్రమందు జన్మించినవాడూ, ధర్మాత్ముడూ, సత్యవంతుడూ, మునికులమునందు పుట్టినవాడూ అగు మౌళిశిష్టుడు అను వైశ్యపుంగవుడు, ఆ మంత్రిని చూచి, "ఓ యీ! అయుష్యము, కర్మ ద్రవ్యము, జీవన ఉపాధికృతము ఆదియందు సకల ప్రాణులకూ బ్రహ్మదేవుడు ఏర్పరచెను. మీకునూ, మాకునూ లోకములో సంబంధము ఎక్కడా లేదు. మూడవవర్ణములో పుట్టిన కన్యకను భూమిలో ఎక్కడైనా, ఏ రాజైనా విధిప్రకారమూ ధర్మపత్నిగా చేసికొనెనా? మీవాక్యము పరిహాసమునకు కారణమగుచున్నది. ఇటువంటి వృత్తాంతము ఎక్కడా వినబడినదీ, కనబడినదీ కాదు" అని పలికెను.

19½ - 23½ అ. 32 - పుట 337

మౌళిశ్రేష్ఠి (శాస్త్ర) యుక్తముగా పలికిన తర్వాత, విక్రమసింహుడు "అహా! చంద్రవంశము తోడి సంబంధము మీకు తపస్సువలన కలుగునది. మీకు భరత వంశముతోడి సంబంధము చక్కగా ఉండును. అర్జునునివంశమునందు పుట్టిన బుద్ధికుశలుడగు మహారాజుతో సంబంధము వైశ్యవంశమునకు పావనమును, శుభములనూ కలిగించును. సకల లోకములనూ పావనము చేయు గంగ, మార్గములో తనతో కలియు జలమును ఎట్లు పావనము చేయుచున్నదో, అట్లే చంద్రవంశముతోడి బంధుత్వము వైశ్యులను పావనము చేయును.

24- 27½ అ. 32 - పుట 337

విక్రమసింహుని మాటలు అఖిల గోత్రము నందు పుట్టిన మర్త్యలశ్రేష్ఠి అను వైశ్యునికి కోపాన్ని కలిగించగా, ఆయనలేచి, "ఓ యీ! మంత్రివర్యా! మీరాజుతో చేయు సంబంధమువలన మాకు వచ్చు కీర్తి ఎంతటి గొప్పదైనా, అది మాకు తృణముతో సమానము. అపకీర్తినీ, కల్మషమునూ లేని మేము ఇంద్రుని సంపదను కూడ గొప్పదిగా తలంచము" - అని తిరస్కారముగా పలికెను.

28 - 30½ అ. 32 - పుట 337

ఆ మాటలు విక్రమసింహునికి కోపము కలిగించినవి. కన్నుల కొనలు ఎఱ్ఱగానైనవి. ఆ ఎఱ్ఱని నేత్రములతోనే ఆ మర్త్యలశ్రేష్ఠిని భయపెట్టూ ఓయీ! బ్రహ్మ ముఖమున బ్రాహ్మణులూ, భుజముల నుండీ క్షత్రియులూ పుట్టినారు. బ్రాహ్మణుడు నాలుగు జాతుల వారినీ వివాహం చేసుకోవచ్చును. క్షత్రియుడు మూడు వర్ణములవారినీ వివాహం చేసుకోవచ్చు. వైశ్యులు రెండు వర్ణముల వారినీ వివాహం చేసుకోవచ్చు. శూద్రుడు తన వర్ణము వారినే వివాహం చేసుకోవాలి. ఇట్లే పూర్వము జరుగలేదా! దీనిలో ధర్మవిరుద్ధమైనదేమి ఉన్నది" - అని ప్రశ్నించెను.

31 - 34½ అ. 32 - పుట 338

(ఇంకావుంది)

## స్వతంత్రభారతి స్వర్ణోత్సవాలు




# "అసలు, సిసలైన గాంధేయవాది" శ్రీ వంకదారిసత్యనారాయణ

శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, కడప.



కడపజిల్లా తలుపులు తెరచి, సహకారోద్యమానికి స్వాగతం పలికిన తొలివ్యక్తి శ్రీ వి.ఆర్. సత్యనారాయణగారు. నిజం నిప్పులాంటిదని తెలిసికూడ, నిర్భయంగా వాస్తవాన్నిచెప్పే మనస్తత్వమీయనిది. ఋజువర్తనకు, స్వార్థరహిత బుద్ధికి, పరిపాలనాదక్షతకు శ్రీ సత్యనారాయణగారు ఉనికిపట్టు. దాదాపు పాతికవత్సరాలుగా రాజంపేట గ్రామపంచాయితీ అధ్యక్ష్యభారాన్ని మోస్తూ ఆ గ్రామాభివృద్ధికి వీరుచేసిన కృషి - సేవ అనుపమానం. కడపజిల్లాలో ప్రథమ శ్రేణీపంచాయితీగా రాజంపేట యెన్నుకోబడడం, రాష్ట్ర స్థాయిలో ద్వితీయ బహుమతిని యీ పంచాయితీ అందుకోవడం యిత్యాదులు వీరి పరిపాలనాదక్షతకూ, విసుగు, విరామం యెఱుగని కర్తవ్యనిర్వహణకూ, సేవాభావానికీ ప్రత్యక్షనిదర్శనాలు.

తమ తండ్రిగారిచే స్థాపింపబడిన స్థానికార్యవైశ్యసంఘాధ్యక్షపదవిని తండ్రిగారి అనంతరం తాను స్వీకరించి తదేకదీక్షతో ఆ సంఘాభివృద్ధికి, 'మాతృశ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీఆలయాభివృద్ధికి వీరు యెనలేని సేవచేశారు, ఎవరైనా ఒకమాట ఆయన్ను పొరబాటుగానైనాసరే అన్నారంటే ఆ పట్టణంలోఉన్న వైశ్యులెవరూ సహించేవారుకారు. ఒకసారి వీరిని యెవరో ఒక వైశ్యసోదరుడు నిర్లక్ష్యంగ మాట్లాడాడట. అంతే అతనితో సభాముఖంగా క్షమాపణచెప్పించినంతవరకు స్థానికవైశ్యులు యెవరూ నిద్రపోలేదంటే ఆ ప్రాంతం వైశ్యులకు ఆయనపైఉన్న అభిమానం, ప్రేమ, భక్తి, విశ్వాసం యెంతటిదో ఊహించుకోవచ్చు. ఒక్క వైశ్యులలోనే గాదు. రాజంపేట గ్రామంలోని యావన్మంది ప్రజల హృదయాల్లోకూడ సత్యనారాయణగారు యిదేవిధమైన స్థానాన్ని సంపాదించుకొన్నారు. కుల, మతభేదాలకు, స్వపర విభేదాలకు అనుమాత్రం అవకాశం ఇవ్వకుండా రాజంపేటగ్రామానికీ, కడపజిల్లా అభివృద్ధికీ తనవంతుకర్తవ్యాన్ని పవిత్రవంతంగా నిర్వహించి కడపజిల్లా రాజకీయ చరిత్రలో విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్న శ్రీ వి.ఆర్. సత్యనారాయణగారు స్వర్గీయ

టంగుటూరిప్రకాశంగారి ప్రియశిష్యుల్లో ఒకరు. వీరు 1909వ సంవత్సరంలో రాజంపేట గ్రామంలోని సుప్రసిద్ధ వైశ్య కుటుంబములో జన్మించారు. ప్రాథమిక, మాధ్యమికవిద్యలను రాజంపేటలోనే ముగించుకొని మద్రాసులోని పచ్చియప్ప కళాశాలలో చేరి ఇంటర్మీడియట్‌వరకూ చదివారు. విద్యార్థిదశలోనే కాంగ్రెసులో ప్రవేశించి, బాపూజీపూరించినస్వాతంత్రోద్యమసమరశంఖారావంతో ఉత్తేజితులై పంతులుగారి నేతృత్వమున బ్రిటీష్‌వారిని సముద్రాలను దాటించేందుకు చురుగ్గా పనిచేశారు. 1941వ సంవత్సరంలో జరిగిన ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. విదేశీవస్త్రబహిష్కరణోద్యమంలో అగ్రగామిగానిలిచారు. 'క్విట్‌ఇండియా' ఉద్యమంలో పాల్గొని నాలుగునెలలు కారాగార శిక్షను అనుభవించారు. ప్రదేశ్‌కాంగ్రెసు కమిటి సభ్యులుగా ఐదు సంవత్సరాలు పనిచేశారు. స్వర్గీయ వి.ఆర్. సత్యనారాయణగారు రాజకీయ, సాంఘికాది వివిధ రంగాలలో మంచి అనుభవాన్ని గడించారు. ప్రత్యేకించి సహకారరంగంలో అయన గడించిన అనుభవం తిరుగులేనిది. కడప జిల్లా సహకారోద్యమచరిత్రలో సత్యనారాయణగారిపేరు ప్రథమపుటల్లో లిఖించదగినట్టిది. దైవదత్తమైన ఆయనలోని ప్రతిభావ్యుత్పత్తులు, శక్తిసామర్థ్యాలు కడపజిల్లా ప్రజలకు 1929 నుండే పరిచయం. కడపజిల్లా కో-ఆపరేటివ్ సెంట్రల్‌బ్యాంకుకు, కడపజిల్లా కో-ఆపరేటివ్‌మార్కెటింగ్‌సొసైటీకి సత్యనారాయణగారు ఉపాధ్యక్షులుగా ఉండి వాటి అభివృద్ధికి నిరవధికకృషి చేశారు. 1926 - 27లో రాజంపేటలో రాజంపేటతాలూకా సహకారఅర్బను బ్యాంకును స్థాపించి అధ్యక్షులయ్యారు. రాజంపేట కో-ఆపరేటివ్ స్టోర్సును, వీవర్సు సొసైటీని స్థాపించిన ఘనతకూడ వీరికే దక్కింది. 1935లో రాజంపేట కో-ఆపరేటివ్ భూమి అభివృద్ధి బ్యాంకిని స్థాపించి అతిదీర్ఘకాలం ఆ బ్యాంకుకు అధ్యక్షులుగా ఉండినారు.

**మీ కృషిని ఏనాటికీ వైశ్య లోకము మరువలేనిది**

ఆర్యా!

ఆర్యవైశ్యసంఘాల అభివృద్ధికి కానీ, మన పూర్వవైశ్యులు ఏర్పరచిన వైశ్యసంస్థల విలువైన ఆస్తులను ప్రభుత్వ, ప్రైవేటు వ్యక్తుల దురాక్రమణనుండీ కాపాడు విషయములో కానీ తమరు ఏలాంటి పదవి, ప్రలోభాలకు లొంగక నిజాయితీగా, నిర్భీతిగా, నిరాటంకంగా చేయుచున్న కృషిని వైశ్యలోకము ఏనాటికీ మరువలేదు అను విషయం తిరుగులేని వాస్తవం

బచ్చు తిరుపతిరావు,(అధ్యక్షులు)
శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ
అమ్మవారిసత్రం, చలివేంద్రం,
ఏలూరు.
పశ్చిమగోదావరి జిల్లా
6 - 11 - 97.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1998 జనవరి 21 నుండి 1998 ఫిబ్రవరి నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 25 | ఫిబ్రవరి 1 | 8 | 15 | |
| సోమవారము | | 26 | 2 | 9 | 16 | |
| మంగళవారము | | 27 | 3 | 10 | 17 | |
| బుధవారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| గురువారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| శుక్రవారము | 23 | 30 | 6 | 13 | 20 | |
| శనివారము | 24 | 31 | 7 | 14 | | |

జనవరి 24 :- శ్రవణకార్తె రాక ఉ. 9-42

జనవరి 26 :- సంపూర్ణ స్వాతంత్ర్యదినము (రిపబ్లిక్‌డే) జాతీయ సెలవుదినము. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంసలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవుదినము.

జనవరి 29 :- మాఘస్నానారంభం

| | | |
|---|---|---|
| జనవరి | 30 :- | శ్రీ వాసవీఆత్మార్పణదినము - గాంధీనిర్యాణదినము - మృతవీరులసంస్మరణ దినము - రంజాన్ పండుగ. |
| జనవరి | 31 :- | పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1997 డిసెంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పెట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ జనవరి 31వ తేదీలోగా చెల్లించాలి. |
| జనవరి | 31 :- | 1997 డిసెంబరునెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు చివరితారీఖు. |
| ఫిబ్రవరి | 3 :- | రథసప్తమి |
| ఫిబ్రవరి | 6 :- | ధనిష్టకారె రాక ప. 12-52 |
| ఫిబ్రవరి | 7 :- | భీష్మఏకాదశి. |
| ఫిబ్రవరి | 8 :- | గురుమౌఢ్య ఆరంభం |
| ఫిబ్రవరి | 11 :- | మాఘపౌర్ణమి |
| ఫిబ్రవరి | 15 :- | చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు అఖరురోజు. |
| ఫిబ్రవరి | 17 :- | శతభిషం కార్తె ప. 3-38 |
| ఫిబ్రవరి | 19 :- | శ్రీరామకృష్ణపరమహంస జన్మదినము |
| ఫిబ్రవరి | 20 :- | A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితేది. |

## 25, 1, 8, 15 ఆదివారాలు

- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# జయంసుబ్రమణ్యానికి - బాలకృష్ణయ్య వ్రాసిన లేఖలోని సారాంశాలు

మహాసభ పనితీరునూ, అధ్యక్షులుగా ఎన్నిక అగుటకు ముందు శ్రీ జయం సుబ్రమణ్యంగారు చేసిన వాగ్దానాల నెరవేర్పుని పైనాన్నీ ప్రశ్నిస్తూ, శ్రీ ఓరుగంటి బాలకృష్ణయ్యశ్రేష్ఠిగారు 'జయము' వారికి ఏడుపేజీల లేఖను వ్రాశారు. శ్రేష్ఠిగారు 7-12-1997న తాను వ్రాసిన ఆ ఉత్తరాన్ని ప్రచురించమని కోరుచూ ఈ పత్రికా కార్యాలయానికి దాని నఖలును పంపారు. ఆ లేఖలోని ముఖ్యసారాంశాన్ని ఈ క్రింద ప్రచురిస్తున్నాము. శ్రేష్ఠిగారు దాదాపు నాలుగు సంవత్సరాలు మహాసభకు ప్రధాన కార్యదర్శులుగా పనిచేశారు - సంపాదకులు.

1997 - 99 సంవత్సరమునకు మహాసభకు మీరు అధ్యక్షలుగా ఏకగ్రీవంగా ఎన్నిక అగుటకు నేను, మరికొంత మంది అధ్యక్షులుగా ఉండాలనుకొన్న అభ్యర్థులు సహకరించి, మీకు మార్గము సుగమము చేసిన విషయము విదితమే. ఆనాడు రాష్ట్రజనరల్‌కౌన్సిల్ సమావేశములో మహాసభ పటిష్టతకూ, పురోభివృద్ధికీ, జీవితసభ్యుల పెంపుదలకూ, వాసవీ ప్రవంతి మాసపత్రిక నష్టములోనుంచి బయటపడుటకూ కృషి చేస్తానని ఆవేశ పూరితంగా చెప్పారు. రాయలసీమ, కోస్తా, తెలంగాణా ప్రాంతాలలో మూడుజీపులను స్వంతఖర్చులతో పెట్టి, జీవితసభ్యులను చేర్పించుటకు కృషి చేస్తాననీ చెప్పారు. ఆ ప్రయత్నం ఇంతవరకూ మీరు చేయలేదు.

మహాసభకు భారం కాకుండా టి.ఎ., డి.ఎ. తీసుకోననీ, కారును అమ్మి ఆ పైకంతో మహాసభ లోటును తగ్గించుటకు కృషి చేస్తాననీ, ఒక సంవత్సరానికి లక్షరూపాయలు ఖర్చు అయినా నా స్వంతఖర్చులతో రాష్ట్రమంతా పర్యటిస్తాననీ, ఉపన్యాసములో కాదు - ఆచరణలో చూపు తాను అనికూడ ఆ సందర్భంగా చెప్పారు. అది జరిగి ఇప్పటికి తొమ్మిది మాసాలైంది. కార్యవర్గ సభ్యుల్లో తొంభైశాతంమంది టి.ఎ., డి.ఎ.,లు తీసుకోకుండా స్వంత ఖర్చులతో పనిచేస్తుంటే - మీరు కారును విక్రయించక పోవడమేకాక దాని నిర్వహణక్రింద వేలాదిరూపాయలు ఖర్చుచేస్తూ, ఆ ఖర్చులను మహాసభ లెక్కల్లో వ్రాస్తున్నారు. ఇది ఎంతవరకూ న్యాయము? ఆత్మ పరిశీలన చేసుకొని ఆ ఖర్చులను భర్తీచేసిన సమంజసంగా ఉంటుంది.

మహాసభ నియమాల ననుసరించి పాలకవర్గ, కార్యవర్గసభ్యులసమావేశాలను ఏర్పాటు చేయుటలేదు. తొమ్మిది నెలల కాలములో రెండు కార్యవర్గసమావేశములను మాత్రమే జరిపారు. కార్యవర్గసమావేశము తీర్మాణములు పంపుటలేదు.

శ్రీ జూటూరు వేమయ్యగారు అధ్యక్షులుగా ఉన్నపుడు 1991-93లో జరిగిన నియమావళి నిర్ణయ సమావేశములో మాజీ అధ్యక్షులకూ, మాజీ ప్రధానకార్యదర్శులకూ కూడ పాలకవర్గ సమావేశ సూచన

లను పంపాలని, మహాసభ మాజీ ప్రధాన కార్యదర్శిగా మీరు గట్టిగా మాట్లాడారు. అదే మీరు ఇప్పుడు "ఆఫీసుబేరర్సు మీటింగు నోటీసు"లను మహాసభ మాజీ అధ్యక్షులకు పంపితేచాలనీ మాజీ ప్రధాన కార్యదర్శులకు పంపనవసరము లేదనీ ఆదేశించారు.

మహాసభ కార్యక్రమాలు ద్విగుణీ కృతంగా జరుగుటకు వీలుగా అధ్యక్ష ఎన్నిక జరిగిన 15 రోజులు లేక నెల లోగా అవసరమైన ఉపసంఘాలను నియమించి, నియమితులైన వారి వివరాలను పాలక వర్గం, కార్యవర్గం మొదలగు వాటితోబాటు అందుకు సంబంధించిన వారందరికీ పంపాలి. వాటి ఏర్పాటు ఇంతవరకూ పూర్తికాలేదు. ఈ సందర్భముగా మీరు అవలంబిస్తున్న వైఖరి 'దేవరచిత్తం మాభాగ్యం' అన్నట్లుగా ఉంది.

రాయలసీమకు సంబంధించిన కార్య దర్శిని అధ్యక్షఎన్నిక జరిగిన ఆరునెలల తర్వాత నియమించారు. అట్లే మహిళా విభాగ అధ్యక్షురాలి నియామకాన్ని కూడ ఆరునెలల తర్వాతే చేశారు. ఈ విషయాన్ని మీ విజ్ఞతకే వదలిపెట్టున్నాను.

మహాసభసభ్యత్వ మొత్తమునుండీ భవననిర్మాణానికి 4 1/2 లక్షల రూపాయల పైచిలుకు బ్యాంకులో తక్కువ డిపాజిట్ చేశారు. మూడవఅంతస్తు నిర్మాణం పూర్తికాగానే, భవననిధిని వసూలుచేసి, సభ్యత్వరుసుం లోట్టును పూర్తిచేస్తా మన్నారు. 'భవననిర్మాణం పూర్తి అయింది. కావున కమిటీకూడ అవసరంలేదు'అని నియమించలేదు. తొమ్మిదినెలలు పూర్తి అయినవి. ఆ లోటును ఎంతవరకూ భర్తీచేశారు?

సౌకర్యములకు అని అదాయానికి మించిన ఖర్చులు చేస్తున్నారు. మహాసభ భరించగలదా? భవిష్యత్తులో సంస్థ పరిస్థితి ఏమిటి?

వాసవీస్రవంతి మాసపత్రికకు ప్రతి యేడూ లక్షరూపాయలకు పైగా నష్టము వస్తూఉంది. ఆ పత్రికకు రావలసిన బాకీలు వసూలుచేసి, క్రొత్తగా ప్రకటనలు సంపాదించి దాని ఖర్చులను పరిమితంచేసి, నష్టము రాకుండా చేస్తాను అన్నారు. ఈ విషయములో మీరు సాధించిన ప్రగతి ఏమిటో లెక్కలు చూచి చెప్పండి.

మహాసభకార్యాలయము, అతిథి గృహములో పనిచేయు సిబ్బంది జీతాలను ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి వారి 'క్యాడేర్‌ను' బట్టి పెంచడం ఇంతవరకూ నూతనాధ్యక్షులురాగానే జరిగేది. ఇంత వరకూ మీరు వారిజీతాలను పెంచలేదు.

మహాసభలో పనిచేయువారు పేదవారు కనుక వారి సౌకర్యము ననుసరించి, సైకిల్లోనో, బస్‌లోనో టైముకు వస్తారు. తక్కువ జీతము వారైనందున, వేడినీళ్ళకు చల్లనీళ్ళుగా ఉండాలని 'బస్‌పాస్'కు అగు మొత్తాన్ని ఇచ్చేవారము. 'బస్‌పాస్' చూపి తేనే డబ్బు ఇస్తాము. లేకుంటే ఇవ్వము అని మీరు ఈ సందర్భంగా నిర్ణయం తీసుకోవడం న్యాయమా?

మహాసభలో పనిచేసేవారికి విజయ దశమికో లేక దీపావళికో ఒకనెల బోనస్ ఇచ్చేవారము. దీపావళికి ఇవ్వలేదు. మహాసభలో పనిచేసేవారలలో 80శాతం

వైశ్యులే. వారంతా మహాసభను నమ్ముకొని పనిచేస్తున్నారు. వారికి తొమ్మిదినెలలైనా జీతాలు పెంచలేదు. దీపావళికి ఇచ్చే బోనస్ ఇవ్వలేదు. బీదవైశ్యులను ఉద్ధరిస్తామంటూ మనదగ్గర పనిచేసేవారినే ఆదరించకపోతే పేదవైశ్యులకు ఏమి సహాయం చేసినట్లు?

'మహాసభ గెస్టుహౌస్'లో అటెండరుగా ఉన్నవ్యక్తికి ఇష్టమని భావించి, సూపర్ వైజరుగా ప్రమోషన్ ఇచ్చి మహాసభ ఆఫీసు మేనేజరుకు ఇచ్చు జీతముతో సమానముగా రూ. 2000/-లుగా జీతాన్ని నిర్ణయించడం సమంజసమా?

ఆర్థికదుస్థితీ, చాలీచాలని జీతాలతో సిబ్బంది బాధపడుతూ - తోటి ఉద్యోగుల వద్ద అప్పుగా తీసుకొన్న రూపాయలకు వడ్డీ ఇవ్వవద్దనడమూ -ఒకరికి ఆరుమాసాలుగా జీతాన్ని ఇవ్వక ఆతను కట్టవలసిన వడ్డీని కట్టనివ్వక వడ్డీఎక్కువ ఇవ్వననీ, లేదనీ వారి స్వంత వ్యవహారాలలో తనదూర్చడం శ్లాఘించదగినదా?

కొన్ని జిల్లాల ఆర్యవైశ్యసంఘాలు తొమ్మిదిమాసాలైనా ఎన్నికలు నిర్వహించకా, మరికొన్ని సంఘాలు సమస్యలతో సతమతమవుతూనూ ఉంటే, ఏ నిర్ణయాన్నీ తీసుకోక ఆ జిల్లాలను విస్మరించడం శోచనీయము.

రాయచూర్‌లో మహిళాసదస్సు జరుపగావే బాధ్యతపూర్తికాలేదు. దానివలన కలిగిన ప్రగతి ఏమి అని బేరీజు వేసుకొన్నపుడే ముందడుగు వేయగలము.

'ఇంటగెలిచి, రచ్చగెలువు' అన్నట్లుగా మహాసభలో ఉన్న సమస్యలను తీర్చండి. మనపెద్దలు ఏ లక్ష్యముతో మహాసభను ప్రారంభించినారో ఆ లక్ష్యసాధనకు కృషి చేయండి.

మహాసభకు అధ్యక్షులుగా పోటీచేసినపుడు మీరు చేసిన వాగ్దానాలను ప్రకటించిన 29-3-1997 తేదీగల తెలుగుసీమ వారపత్రిక సంపుటి 36, సంచిక 54లోని 3వ పేజీ నకలును ఈ లేఖతో జతపరచి పంపుచున్నాను.

# వివాహం

అనంతపురం జిల్లా ధర్మవరం వైశ్య ప్రముఖులు శ్రీ అంబటినాగరాజు గారి కుమారులు చి॥ వెంకటేశ్, బి.టెక్., గారి వివాహం, కడప వాస్తవ్యులు శ్రీ టంగుటూరురెడ్డెయ్యశ్రేష్ఠిగారి కుమార్తె చి॥ హైమ, బి.కాం., గారితో 19-12-1997వ తేదీన ధర్మవరములోని నూతన శ్రీ వాసవీకన్యకా పమేశ్వరీ కల్యాణమంటపములో వైభవంగా జరిగింది.

**గమనిక :** ఈ శీర్షికలో ప్రకటనకావాలనుకునేవారు యం.ఓ. లేక డి..డి. ద్వారా రూ. 116/-లు పంపూచూ అవసరమైన వివరాలు వ్రాయాలి.

**డాక్టర్ పి. శివరామయ్యగారికి స్వర్గారోహణ**

ప్రసిద్ధవైద్యులు, డాక్టర్ పెంటంశెట్టి శివరామయ్యగారు కడప పట్టణములోని తమ స్వగృహములో 26-12-1997వ తేదీన స్వర్గస్తులయ్యారు.

# భారతదేశ స్వాతంత్ర్యము కోసం పోరాడిన వైశ్యసోదరులు



సేకరణ శ్రీచుండూరిఅప్పారావు. రావెల

### ఖమ్మంజిల్లా

1. గెల్లాకేశవరావు
2. పసుపర్తివెంకటలక్ష్మయ్య
3. వేములపల్లిజగన్నాధం
4. పినిశెట్టిశ్రీరామమూర్తి
5. పినిశెట్టిపాపయ్య
6. కంచర్లకామేశ్వరరావు
7. రాయపూడినారాయణరావు
8. చుండూరినరసింహరావు
9. చల్లాలక్ష్మీనారాయణ
10. మోటుమర్రికుమారస్వామి
11. మేళ్ళచెర్వుశోభనాద్రి
12. మైలవరపుసత్యనారాయణ
13. చలవాదిరంగయ్య
14. వేమిశెట్టిఅనంతరామయ్యగుప్త
15. కోనరామచంద్రరావు
16. నాళ్ళబలరామయ్య
17. కొత్తగండ్లసుబ్బారావు
18. చారుగుండ్లరంగారావు
19. చేవూరివెంకన్న
20. నరేంద్రులమల్లిఖార్జునరావు
21. ఎర్రాతిరుపతయ్య
22. రేపాకనాగభూషణం
23. కంభంపాటిసుబ్బారావు
24. ఏ.యస్. గుప్త
25. ఎర్రరామయ్య
26. కనమర్లపూడిరామయ్య
27. చందావీరభద్రం
28. ఒంటిపల్లిరాములు

### వరంగల్‌జిల్లా

1. దుగ్గిశెట్టివెంకటయ్యగుప్త
2. శ్రీరామ్‌చంద్రమౌళి
3. పార్శిఈశ్వరయ్య
4. చకిలంవిరూపాక్షలింగం.
5. పినిశెట్టిచక్రపాణి
6. అల్లాడిమల్లయ్య
7. పెద్దిఅంజయ్యగుప్త
8. వెలిగందులజనార్ధన్
9. పెద్దినారాయణగుప్త

### కరీంనగర్‌జిల్లా

1. ఎన్. మలహరగుప్త
2. నార్లదుర్గయ్య

### మెదక్‌జిల్లా

1. బసవమాసమ, మాజీ శాసనసభ్యులు
2. బచ్చువెంకటేశ్వరగుప్త

### నిజామాబాద్‌జిల్లా

1. మోటూరురామచంద్రం
2. అరుగులరామదాసు
3. కొండ్రశంబయ్య
4. గంగంభూమలింగం
5. మక్కాజానకిరాం
6. పల్లినరసయ్య
7. బాపెట్టిగంగారం
8. కొత్తపల్లిబుచ్చయ్య
9. ఆర్. నారాయణ
10. చింతలఆగయ్య
11. బోతుకూరులచ్చయ్య
12. గిజివాడమాణిక్యం

13. దిప్పలలక్ష్మయ్య
14. రాచకొండచెన్నయ్య
15. విఠల్ చతురావారు

**మహబూబ్‌నగర్‌జిల్లా**

1. కొత్రికరంగయ్యగుప్త
2. కొత్తకేశవులు, మాజీ శాసనసభ్యులు

**నల్గొండజిల్లా**

1. తెడ్లలింగయ్య
2. చేవళ్ళవిశ్వనాథం
3. చలంచర్లలింగయ్య
4. గౌరులింగయ్య
5. చలంచర్లఉపేంద్ర
6. ముక్కఅప్పయ్య
7. చెన్నారామనర్సయ్య
8. మద్దిలింగయ్య
9. తర్నిగిరిరాఘవయ్య
10. గౌరువెంకయ్య
11. తొనుసూరిలింగయ్య
12. ఫారేపల్లిఎలమంద
13. కర్నాటిరత్నయ్య
14. గుంటూరువెంకయ్య
15. అల్లానిరంగయ్య
16. ఓరుగంటిఅప్పయ్య
17. కిక్కిరేణిలింగయ్యశాస్త్రి
18. నూకలవాసుదేవ్
19. గౌరుకాంతయ్య
20. శాస్త్రిలింగయ్య
21. పి.పి.ఎల్. గుప్త
22. జైనిమల్లయగుప్త
23. గుండాకేశవులు
24. పి. రాజయ్యగుప్త
25. నీలంవిశ్వనాథం
26. తెడ్లదుర్గయ్య
27. చేవళ్ళసత్యనారాయ
28. పోలవెంకయ్య
30. గుడిపాటిఅంజనేయులు
31. వీరవెళ్ళినాగయ్య
32. ఓరుగంటినర్సయ్య
33. దేవరశెట్టివెంకయ్య
34. వీరవెళ్ళిరామయ్య
35. పొరాఅంతయ్య
36. చిల్లంచెర్లరాములు
37. నరేంద్రనాగయ్య
38. తోటనర్సింహగుప్త
39. డా॥ యమ్.వి. గుప్త
40. పాలవరపులక్ష్మీనరసయ్య
41. రాచకొండవిశ్వనాథం
42. తాడిశెట్టినరశింహగుప్త
43. పాలాదినారాయణ
44. పాలాదిరాములు

**సికింద్రాబాదుజిల్లా**

1. సింగంసత్యనారాయణ
2. ఉప్పలవీరేశంగుప్త
3. శ్రీ వి.జి. శంకర్
4. బొలుసానిశ్రీధర్
5. ఆకులరాజయ్యగుప్త
6. పబ్బరాజకుమార్
7. పండరి
8. మురికిదుబ్బయ్య

**హైద్రాబాదుజిల్లా**

1. ఎం. కనకదుర్గప్రసాద్‌గుప్త
2. వి. కన్నయ్యగుప్త
3. జక్కానినరసింహులు
4. గజవాడమల్లయ్య
5. జొన్నవాడరాజయ్య
6. ఎన్.ఆర్. గుప్త
7. మేడిశెట్టివెంకయ్య
8. బచ్చురాజేశ్వరయ్య
9. కె.సి. గుప్త

(స్వతంత్రభారతి స్వర్ణోత్సవాల సందర్భంగా)

# వ్యక్తులను అరెస్టుచేసే సమయంలో.....
# నిర్బంధకాలంలోను పోలీసులు పాటించవలసిన నిబంధనలు

పోలీసు యంత్రాంగం బాధ్యతాయుతంగా, పూర్తి జవాబుదారీతో వ్యవహరించాలని సుప్రీంకోర్టు ఆదేశించింది. ఎవరినైనా అరెస్టుచేసే సందర్భంలోను, ఆ తరువాత పోలీసు యంత్రాంగం ఈ క్రింది నిబంధనలు పాటించాలని ఆదేశాలు జారీ చేసింది.

**నిబంధనలు :**

1. వ్యక్తులను అరెస్టు చేసే సందర్భంలోను, నిర్బంధితులను ప్రశ్నించేటపుడు పోలీసు అధికార్లు తమ పేర్లను, హోదాలను తెలిపే బ్యాడ్జీలను స్పష్టంగా కనపడేవిధంగా తమ యూనిఫారానికి అమర్చుకోవాలి. నిర్బంధితుల విచారణ జరిపే పోలీసుల వివరాలను ఒక రిజిస్టర్‌లో నమోదు చేయాలి.
2. ఎవరైనా వ్యక్తిని అరెస్టు చేసే సమయంలో పోలీసు అధికారి 'అరెస్టుమెమో' ను తయారు చేయాలి. అరెస్టు అయిన వ్యక్తి కుటుంబసభ్యుల్లో ఎవరైనా ఒకరితో కాని, లేదా అరెస్టు జరిగిన ప్రాంతంలోని ఒక గౌరవనీయ వ్యక్తితో కాని ఈ 'మెమో' పై ధృవీకరణ సంతకం చేయించాలి. ఈ విషయాన్ని నిర్ధారిస్తూ, అరెస్టయిన వ్యక్తితో కూడా 'మెమో'పై సంతకం చేయించాలి. ఈ 'మెమో'పై అరెస్టుచేసిన సమయం, తేదీ కూడా నమోదు చేయాలి.
3. 'అరెస్టు మెమో'పై ధృవీకరణ సంతకంచేసే వ్యక్తి నిర్బంధితుడికి స్నేహితుడు లేదా బంధువుకాని పక్షంలో; తన స్నేహితుడు లేదా బంధువుకు, లేదా తనకు తెలిసిన ఎవరైనా వ్యక్తికి, లేదా తన శ్రేయస్సును కోరుకునే వ్యక్తికి తన అరెస్టు గురించిన సమాచారాన్ని తెలియజేసే హక్కు నిర్బంధితునికి ఉంది.
4. నిర్బంధితుడి స్నేహితుడు లేదా బంధువు వేరే జిల్లాలో, లేదా వేరే పట్టణంలో ఉన్నట్లయితే, ఆ జిల్లాలోని న్యాయ సహాయసంస్థ ద్వారా ప్రాంతీయ పోలీసుస్టేషన్ సహాయంతో అరెస్టు సమయం, స్థలం, నిర్బంధించిన స్థలం మొదలైన వివరాలను టెలిగ్రామ్ ద్వారా అరెస్టు చేసిన 8 నుంచి 12గంటల వ్యవధిలో వారికి తెలియచేయాలి.
5. అరెస్టయిన వెంటనే తన అరెస్టు గురించిన సమాచారాన్ని తనకు సంబంధించిన వ్యక్తికి తెలిసేలా చేసుకునే హక్కు తనకుందనే విషయాన్ని నిర్బంధితుడికి తెలియజేయాలి.

6. ఎవరైనా వ్యక్తిని అరెస్టుచేసి, నిర్బంధంలో ఉంచినప్పుడు నిర్బంధించిన స్థలంవద్ద ఒక డైరీలో అరెస్టుగురించి పేర్కొనాలి. అరెస్టు గురించిన సమాచారాన్ని నిర్బంధితుడి స్నేహితుడికి లేదా బంధువుకు తెలియజేసిన తరువాత, ఆ వ్యక్తి పేరును; ఏ పోలీసు అధికార్ల నిర్బంధంలో అయితే ఉన్నాడో ఆ పోలీసు అధికారుల పేర్లు, వివరాలను కూడా ఈ డైరీలో రాయాలి.

7. నిర్బంధితుడు అభ్యర్థించిన పక్షంలో, అతనిని అరెస్టు సమయంలో పరీక్షించి, అతని శరీరంపై చిన్న, పెద్ద గాయాలుంటే వాటిని కూడా ఒక 'మెమో' ('ఇన్‌స్పెక్షన్ మెమో')పై అదే సమయంలో నమోదు చేయాలి. ఈ 'మెమో'పై నిర్బంధితుడు, అరెస్టుచేసిన పోలీసు అధికారి సంతకాలు చేయాలి. ఈ 'మెమో' ప్రతిని నిర్బంధితుడికి ఇవ్వాలి.

8. రాష్ట్ర ఆరోగ్య సేవల డైరెక్టర్ నియమించిన వైద్యుల బృందంలోని ఒక డాక్టర్‌తో నిర్బంధితుడికి ప్రతి 48 గంటలకు ఒకసారి వైద్య పరీక్ష చేయించాలి. అన్ని రెవెన్యూ డివిజన్లకు, జిల్లాలకు ఆరోగ్యసేవల డైరెక్టర్ అటువంటి వైద్యుల జాబితాను రూపొందించాలి.

9. పైన పేర్కొన్న 'అరెస్టు మెమో'తో సహా అన్ని పత్రాలను స్థానిక మేజిస్ట్రేటుకు రికార్డుకోసం పంపించాలి.

10. విచారణ సమయంలో తన న్యాయవాదిని కలిసేందుకు నిర్బంధితుడిని అనుమతించాలి. అయితే, విచారణ కాలమంతటికీ ఈ అనుమతి అక్కర్లేదు.

11. రాష్ట్ర రాజధాని నగరంలోను, అన్ని జిల్లా ప్రధాన కేంద్రాలలోను పోలీసు కంట్రోల్‌రూమ్‌లు నెలకొల్పాలి. ఏదైనా అరెస్టు చేసిన పోలీసు అధికారి ఆ అరెస్టు గురించి, ఆ వ్యక్తిని నిర్బంధంలో ఉంచిన స్థలంగురించి కంట్రోల్ రూమ్‌లకు 12 గంటలలోపు సమాచారం పంపించాలి. ఆయా పోలీసు కంట్రోల్‌రూమ్‌లలో అందరికీ స్పష్టంగా కనిపించే ఒక నోటీసుబోర్డుపై ఈ వివరాలన్నిటినీ ప్రకటించాలి.

**ప్రజల హక్కుల పరిరక్షణకోసం సుప్రీంకోర్టు జారీచేసిన ఈ నిబంధనలను పోలీసుయంత్రాంగం పాటించేలా, ప్రజలు చైతన్యవంతులై వ్యవహరించాలి.**

---

కమీషనర్, సమాచార పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సౌజన్యంతో

# కడప అవోపా రజతోత్సవము

కడప పట్టణ ఆర్యవైశ్యవృత్తిఉద్యోగుల సంఘం ఇరవైఐదేండ్లు పూర్తి చేసుకోనున్న సందర్భాన్నిపురస్కరించుకొని 14-12-1997వ తేదీన ఘనంగా రజతోత్సవ వేడుకలను జరుపుకొంది.

ఈ సందర్భంగా ఆనాటి ఉదయం 10 గంటలకు కడప పట్టణములోని ఆర్యవైశ్య విద్యార్థీవసతిగృహములో రజతోత్సవసభ జరిగింది. ఆ సభకు ఈ సంఘాధ్యక్షులు శ్రీ మేడాసుబ్రమణ్యంగారు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ పి. వెంకట సుబ్బయ్యగారు కార్యదర్శి నివేదికను సమర్పించారు. కడపజిల్లా అవోపాసంఘ ముల అధ్యక్షులూ, అవోపా ప్రాంతీయ సంఘం ఉపాధ్యక్షులూ శ్రీ కె .రామ సుబ్బయ్యగారు ఈ సభలో ప్రసంగిస్తూ, ఈ సంఘం సాధించిన ప్రగతిని వివరించి, అవోపావిద్యానిధికి మూడున్నరలక్షల రూపాయలకు పైగా నిధిని సేకరించి, ఇంతవరకూ దాదాపు లక్షరూపాయలు ఆర్థికంగా వెనుకబడిన వైశ్య విద్యార్థులకు ఉచితంగా సహాయంచేసి, వారి విద్యార్జనకు సహాయపడినామని చెప్పిరి. శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీదేవ్యాలయాలు, ఆర్య వైశ్యధర్మసంస్థలసమాఖ్య అధ్యక్షులూ, ప్రొద్దుటూరుపురపాలకసంఘంఅధ్యక్షులూ, "ప్రజాబంధు" "దానశీల" శ్రీ కామిశెట్టి సుబ్బరావుగారు ఈ సభలో పాల్గొని వైశ్యులు ఐకమత్యాన్ని పెంపొందించుకొని రాజకీయస్పందనను కలుగించుకోలేకున్న ముందడుగు వేయలేరని అన్నారు. ఆంధ్రప్రదేశ్ అవోపాఅధ్యక్షులు శ్రీ బట్టేపాటి శ్రీరాములుగారు ఈ సభలో రజతోత్సవ సందర్భంగా ఈ సంఘమువారు ముద్రించిన ప్రత్యేక సంచికను ఆవిష్కరించి, రాష్ట్ర అవోపా కార్యక్రమాలను వివరించిరి. రాష్ట్ర అవోపా ప్రధానకార్యదర్శిగా ఈ సభలో పాల్గొన్న శ్రీ మేడాతిమ్మయ్యగారు రాష్ట్ర అవోపా ఇప్పుడు వందకు పైబడినశాఖలతో విస్తరించిందనీ, ఇతరులు ఆదర్శంగా తీసుకొనునట్లుగా అవోపాలు తమ కార్యక్రమాలను రూపొందించుకోవాలనీ, ఉద్బోధించిరి.

మాజీ శాసనసభ్యులూ, ప్రొద్దుటూరు ఆర్యవైశ్యసభాధ్యక్షులూ, శ్రీ కొప్పురపు సుబ్బరావు, శ్రీ జూటూరు వేమయ్య ఈ పత్రికాసంపాదకులు 'సంఘోద్ధారక', 'వైశ్య భూషణ' శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి, దోమా వెంకటస్వామిగుప్త పీఠాధ్యక్షులూ, ప్రొద్దుటూరు పురప్రముఖులూ 'సాహితీ బంధు' శ్రీ జూటూరురమణయ్య, కడపజిల్లా ఆర్య వైశ్యసంఘంఅధ్యక్షులు శ్రీమాకంనాగ రాజగుప్త, కడప శ్రీకన్యకాపరమేశ్వరీదేవ స్థానసంఘంఅధ్యక్షులు శ్రీ పి. సీతా రామయ్య, ఆర్యవైశసామూహికవివాహ సంస్థఅధ్యక్షులు శ్రీమునగారంగయ్య శ్రేష్ఠి, ఆర్యవైశ్యసంఘం అధ్యక్షులు శ్రీ సోమిశెట్టివెంగయ్యశ్రేష్ఠి, ఆర్యవైశ్యసంఘం మాజీఅధ్యక్షులు శ్రీతల్లం సూరయ్య శ్రేష్ఠి, శ్రీ తంబిసుబ్బరామయ్యశ్రేష్ఠి, శ్రీకారంశెట్టిరాజాశ్రేష్ఠి, చిత్తూరు, అనంత పురం జిల్లాల అవోపా సంఘాల అధ్యక్షులు

శ్రీ సత్యం, శ్రీ రాధాకృష్ణ అనంత పురం పట్టణ అవోపా సంఘాధ్యక్షులు శ్రీ జి.వి. సుబ్బయ్యశ్రేష్ఠి, శ్రీ కర్నాటివెంకట సుబ్బరాయుడు శ్రేష్ఠి గారలు ఈ సభలో గౌరవించదగిన అతిథులుగా పాల్గొనగా, వారందరికీ ఈ సంఘాధ్యక్షులు శ్రీ మేడాసుబ్రమణ్యంగారు జ్ఞాపికలను బహూకరించిరి.

మండల ప్రజాపరిషత్ అభివృద్ధి అధికారిగా పదవీ విరమణచేసిన శ్రీ జి. నాగ సుబ్బరాయుడుగారలు సభానిర్వాహకులుగా వ్యవహరించిరి.

1997లో మెరిట్ అవార్డులుపొందిన 18మంది వైశ్యులగు విద్యార్థినీ, విద్యార్థులకు ధృవపత్రాలూ, ఉపకారవేతనాలూ, సాంకేతిక విద్యనభ్యసిస్తూ ఆర్థికంగా వెనుకబడిన 20 మంది వైశ్యవిద్యార్థినీ విద్యార్థులకు ఉపకారవేతనాలనూ ఈ సంఘంవారు ఈ సభలో ఇచ్చారు.

ఈ సంఘము తరపున ఏర్పాటు చేసిన అవోపా విద్యానిధికి లక్షరూపాయలకు పైగా విరాళం ఇచ్చిన ప్రధానపోషకులు శ్రీ గుండా నారాయణశ్రేష్ఠిగారి వదాన్యతను శ్లాఘించి, ఆయనకు ఘనంగా సన్మానం ఈ సభలో ఈ సంఘమువారు చేశారు.

## "వాసవీదేవికి వందనములు"

కీ॥ శే॥ మధురకవి నాళంకృష్ణారావు

"కుసుమగుప్తుని గారాబు కూర్మిపట్టి
కడుపు చల్లఁగ కుసుమాంబ కన్నబిడ్డ
అఖిల వైశ్యుల యిలవేల్పు ఆదిశక్తి
వాసవీమహాదేవికి వందనములు"

"భక్తజనముల పాలిటి పాలవెల్లి
కలుషములను చాల వెదజల్లు కల్పవల్లి
కొసరి కోర్కెల దీర్చు మా కొలముతల్లి
వాసవీ మహాదేవికి వందనములు"

"బలిమిమై తన్ను చెఱబట్ట బాలుపడిన
చెనటి భూవరుబారికిఁ జిక్కకుండ.
తెగువఁ జిచ్చునఁ జొచ్చు సాధ్వీమతల్లి
వాసవీమహాదేవికి వందనములు"

"మానసంరక్షణార్థమై ప్రాణమైనఁ
బాయ తెనుగుఁ కన్నెలు వెనుదీయ
రనుచు
తనదు చరితంబుఁ జాట ధరణి నవత
రించి ఆత్మార్పణమ్ము గావించినట్టి
వాసవీమహాదేవికి వందనములు"

తనదు నిర్మల ధర్మవర్తనముచేత
మహిత మహిళామతల్లి కామణులయందు
అమలమార్గ ప్రదర్శినియై వెలుంగు
వాసవీమహాదేవికి వందనములు"

## కడప ఆకాశవాణిలో "వాసవి"

30-1-1998వ తేదీ శుక్రవారం కడప ఆకాశవాణి కేంద్రమువారు తమ సుప్రభాత కార్యక్రమములో శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవి "సుప్రభాతాన్ని - ఆ తరువాత ప్రసంగాలకార్యక్రమములో ప్రపంచములో ప్రథమసత్యాగ్రహి' "వాసవి" అను ఈ పత్రికా సంపాదకులు "సంఘోద్ధారక" "వైశ్యభూషణ" శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారి ప్రసంగ వ్యాసాన్ని ప్రసారం చేస్తారు.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - శ్రీశైలం : 87140, 87114
తిరుపతి : 50030, పుట్టపర్తి : 87240, 87440,
తిరుమల : 77682, 79327

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

12×12 రూముకు రూ.50000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫొటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 15×9 సైజుగల రూము దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సంగలో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సంగలో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫొటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సంగలో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక బీముకు ఒక సైడు పేరు, ఫొటో వేయబడును. లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 15 రోజులు రూము యివ్వబడును. కొద్దిమందికి మాత్రమే అవకాశము.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సంగలో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సంగలో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, తాత్కాలికముగా వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును.

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును.

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు 2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును. కొద్దిమందికి తిరుమలలో కూడా 15 రోజులు రూము కేటాయించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్థ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును - మొదటి రోజు శ్రీమన్నారాయణడు దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి-7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు 315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని అయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠము ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11 1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు', 'దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.1.98 నుండి 20.2.98 వరకు)

చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి. చెక్కుద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును ఫిబ్రవరి నెల 20వ తేదీనగానీ, అంతకుముందుగా గానీ చేరునట్లుగా పంపాలి.

పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1997 డిసెంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ జనవరి 31వ తేదీలోగా చేర్చాలి.

1997 డిసెంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వనెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి ఆ జనవరి 31వ తేదీలోగా చేర్చాలి.

## ఎమ్మిగనూరులో ఆర్యవైశ్యసంఘము

కర్నూలుజిల్లాకు చెందిన పై పట్టణము లోని ఆర్యవైశ్యులు 26-12-1997న స్థానిక శ్రీ వాసవీదేవ్యాలయములో సమావేశమై సదరు పట్టణములో ఇంతవరకూ వివిధ నామములలోగల ఆర్యవైశ్యులకు సంబంధించిన సంఘములన్నింటినీ రద్దుపరచి వాటన్నింటి స్థానములో "ఎమ్మిగనూరు ఆర్యవైశ్యసంఘము" అను పేర సరిక్రొత్తగా సంఘాన్ని ఏర్పరచుకొని ఈ క్రింది వారలను కార్యవర్గసభ్యులుగా ఎన్నుకున్నారు. జీవిత అధ్యక్షులు శ్రీ గుర్రేవులనారాయణశ్రేష్ఠి, గౌరవాధ్యక్షులు శ్రీ దర్పివెంకటరామయ్యశ్రేష్ఠి, శ్రీ గుర్రేవులవీరన్నశ్రేష్ఠి, ప్రధాన అధ్యక్షులు శ్రీ ప్రతాపువురుకుందయ్యశ్రేష్ఠి, ఉపాధ్యక్షులు శ్రీ చిన్నిశ్రీరాములు శ్రేష్ఠి, శ్రీ అనంతనాగయ్యశ్రేష్ఠి, శ్రీ గుర్రేవుల శ్రీనివాసులుశ్రేష్ఠి, శ్రీ కె. కామేశ్వర రావు, ప్రధాన కార్యదర్శి శ్రీ కె.సి. సత్యనారాయణశ్రేష్ఠి, సహాయ కార్యదర్శి శ్రీ భీమిశెట్టి కృష్ణయ్యశ్రేష్ఠి, శ్రీ టి. రాఘవులుశ్రేష్ఠి, కోశాధికారి శ్రీ కె.యం. శేషయ్యశ్రేష్ఠి, సభ్యులు 23 మంది.

## మీ సంపాదకీయం ఎంతోబాగుంది

ఆర్యా!

వైశ్యప్రబోధిని నవంబరు సంచిక ఈరోజే అందింది. అందులో విలువైన సమాచారం ఉంది. ఆ సంచికలోని మీ సంపాదకీయం కూడ చాలాబాగుంది.

ఇల్లూరుశంకరయ్యగుప్త

గుత్తి, 17-11-97

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.